గినది. సారములేని బుచ్చిరాజుగాథ నింత విస్తృతము చేయుట చదువరుల యమూల్యకాలమును దుర్వినియోగము చేయుటయగునను యెరుక కొంతగలిగెడిని. మన్నింప వేడికోలు.

బుచ్చిరాజు నాటకసంఘములకు చిరమిత్రు డగుటచే మరల నందు చేరినాడు. కాని వయసు మరలినవాడగుటచే నాయికపాత్రము ధరించుట కర్హుడుగాక యప్పుడప్పుడు చేటిక, చెలికత్తె యిత్యాదిపాత్రములను మాత్రమే ధరించి తన నటనాకౌశలమును ప్రకటించుచుండెను.

ఒకనాడు ఉదయ మగుసరికి తెనాలి పట్టణమునందలి యేయెత్తుగోడలపై జూచినను, ఏగుఱ్ఱపుబండిపై జూచినను, ఏజట్కాబండిపై జూచినను, "శాకుంతలము" నేటి రాత్రి ప్రదర్శింపబడునను పెద్దయక్షరములుగల ప్రకటనపత్రములే కానవచ్చెను. బెజవాడయు, చెన్నపురి సింహపురులనుండి యేతెంచిన సుప్రసిద్ధనటరత్నములు శకుంతలాదుష్యంతపాత్రముల ధరియింతురనికూడ యాప్రకటనలయందు వివరింపబడియుండెను.

తెనాలిపౌరులకే కాక యాపురము చుట్టుప్రక్కలనుండెడి గ్రామస్థులకుగూడ నాటకముగాంచెడి దప్పి యెక్కువ. గుంటూరువంటి పెద్దనగరములో వందలు పోగుచేయని నాటకసంఘములు తెనాలిలో వేలు మూటగట్టును. నాడు ప్రధానపాత్రల ధరించువారు సుప్రసిద్ధ నటకులని తెలియుటచే నేలకొలది టిక్కెట్లు పగలు పదిగంటలకే యమ్ముడుపోయినవి. స్థలసంకోచముచే నావల టిక్కెట్ల నమ్ముట మానవలసివచ్చినది. నాడు జనులు సాయంత్రము మూడుగంటలనుండియే నాటకశాలకు రాజొచ్చిరి. ఎనిమిదిగంటల కప్పుడే నాటకశాల జనులతో క్రిక్కిరిసిపోయెను. ఆవల వచ్చినవారికి నిలుచుటకైనను త్రొక్కుళ్ళు ప్రాప్తమయ్యెను. సరిగా తొమ్మిదిన్నరగంటలకు నాటకము ప్రారంభమైనది. జనుల యల్లరి తగ్గినది.

ఇతరరంగములతో బనియేమి మనకు? శకుంతల చెలులతో గలసి చెట్లకు నీళ్ళుపోయు రంగము వచ్చినది. దానిలో మన బుచ్చిరాజుగూడ శకుంతల కొక చెలియై నటనసలిపిన నిజశిరశిరోజములు సగముగప్పెడి సంటగిట్టిన నల్లసంత్రకల కృత్రిమపు కీలుగంటుజడముడితో, పొగమారిన వంటయింటి గోడకు వేసిన సున్నపుపూతవలె కడునల్లనిమోముపై నద్దిన ఫేస్‌పౌడరు అందముతో, పూర్వసువాసినీత్వమును స్ఫురింపజేయు కంచుకమ్ములు లేని తెల్లవలువతో, నూర్ధ్వశరీరము నినుమడించి వంచిన వంగిని నిడుపుగాళ్ళతో, జలకలశహస్తుడై రంగమున నవతరించినాడు కొంటెకోణంగి యెవ్వడో బుచ్చిరాజును క్షణములో గుర్తుపట్టినాడు. 'బ్యాంకీ,' అని యొక్కయఱపు నఱచినాడు. ఆవొక్క కేకవెంట పది కేకలు లేచినవి; ఆపదింటితో వందలు బయలుదేరినవి; ఆవందలతో వే లుప్పతిల్లినవి. సహజముగా నుడుకుబోతగు బుచ్చిరాజున కాకేకలు చెవిసోకుటతోడనే యొడలు కంపము పుట్టినది. శిరమెత్తినవానివలె నైనాడు. అంత తనయునికి మఱచి, పని మఱచి, చేతిలోని జలకలశమును నేలగొట్టి, ఒడలును తొడిగిన

రవిక యున్నట్లయుండ, పైటను, కుచ్చెళ్లను నేకముచేసి గుదిపట్టి నడిగోచీపెట్టి నెత్తిమీది మాయజుట్టు కట్టుత్రాళ్లు సడలి కంఠహారమై మెడను వ్రేలాడుచుండ రంగస్థలమునుండి ప్రేక్షకసమూహములోని కొక్కదూకు దూకి నాడు. ప్రేక్షకులు బుచ్చిరాజు నేమిచేసిరో, బుచ్చిరాజు ప్రేక్షకుల నేమిచేసెనో, వివరము తెలియదు. సభ చిందరవందర యైనది. నాటకము భగ్నమైనది. సుప్రసిద్ధనటకుల నటనా కౌశల్యము గాంచ కుతూహలులై యేతెంచిన పెద్దమనుష్యు లాశాభంగము నంది, ధననష్టమునకు బాల్పడి కొంపల కేగినారు. వేడుకలను వినోదములను భగ్నముచేయవచ్చెడి తుంటరిసంఘమునకు మాత్రమే నాడు కనుల పండు వైనది. నాడుమొదలు బుచ్చిరాజు మరల యెప్పుడుగూడ నాటకరంగమున గన్పడలేదు. నాటకసంఘాధికారులు గూడ నాతని మరల పిలిచియుండరు బహుశః.

# మల్లెపూవు

సహదేవ సూర్యప్రకాశరావు గారు

గుబుసుగా విరివిగఁ జూచి గుప్పుగుప్పు
మనుచుఁ దావి దిగంతము లల్లుకొనఁగఁ
జేసి నీదు సత్వమును ఘోషింతువు మధు
మాసవాసరములయందు మల్లెపూవ!

పెంపెసఁగ వసంతాగమవేళయందు
చంద్రికాధౌతయామినీ సమయమందు
రమ్యతరుగణ విలసితారామవీథి
ఫుల్లమై ప్రకాశింతువు, మల్లెపూవ!

భాసుర మనోజ్ఞమృదులపుష్పములయందు
రమ్యము గులాబియే, సుమరాజ్ఞియనుచు
నెంతు రేకాని, నీకున్నయంత తావి
మార్దవము మసృణము లేదు మల్లెపూవ!

జగతి మూఢుఁడు నీదివ్యసౌకుమార్య
విలసనము చవిఁజూడక విడుచునేని
విడుచుఁగాక నీజాతికి విన్నదనము
మలినము గలుగనేర్చునే మల్లెపూవ!

సరసప్రత్యూష పవన ప్రసారమునను
వాహినీవక్షమున లేచు భంగపంక్తి
వలె హృదంతర్గతమున భావంబు లెన్నొ
వెల్లివిరియును నినుఁ జూడ మల్లెపూవ!

దివ్యచంద్రాతపములోని తెల్లఁదనము
మలయ పవనాంకురములోని చలువఁదనము
పరగ శ్రీచందనములోని పరిమళంబు
వెల్లివిరియును నీలోనె మల్లెపూవ!






పానుగంటి విజయరాఘవరావు గారు

అది యొక చిన్న పల్లెటూరు. అచ్చటి ప్రజలు మిక్కిలి సుఖజీవనులు. వారికిఁ గమ్మని పాలు పెరుగులే కాని కాఫీ యలవాటు లేదు. ఎవరి గుమ్మము ముంగిట వారు శుభ్రముగాఁ దుడిచికొని ముగ్గుఁబెట్టుకొనియుందురు కాని; **Sanitary peon** పై సర్వాధికారము నూపరు. వారు కలహములాడు వారు కారు. విధి వశమున మనస్స్పర్థలు జనించినను, రాజీపడువారే కాని వ్యాజ్యవాదములఁ దెంచుకొని న్యాయస్థానము లెక్కి న్యాయవాదులకు ధనము ధారవోయువారు కారు. పవనుఁడు బాగుగా నెదిగిన పచ్చని పైరులపై వీచి సముద్రపుటలలవలె వానినాడించుచు కన్నుల కానందముఁ గొల్పువాఁడే కాని రోడ్డుపైనుండు దుమ్మును రేఁగఁగొట్టి కన్నులలోఁ బడవేసి యేడ్పించువాఁడు కాఁడు. ఎక్కడఁ జూచినను సహజ సౌందర్యముతోఁ బ్రకృతి తాండవించుచుండెను. చేతితోఁ దీసి, సొంతమగ్గములలో నేసిన దోవతులను బిళ్లకచ్చలుఁబోసికొని కట్టుకొనెడువారే కాని సైకిలు కట్టులతో **English Twill Glad neck** చొక్కాలతో, **German Tweed Short** కోటులతోఁ దిరుగు క్రైస్తవావతారు లెవ్వరు లేరు. ఆయూరియందున్నయుఁ దాటియాకు కొంపలే కాని, మేడలు, మిద్దెలును, లేవు. ఊరిచివరమాత్ర మాయూరి జమీందారుగారగు జగన్నాథదాసుగారి భవనముమాత్రము గలదు. జగన్నాథదాసుగారు సర్వసుగుణ సమన్వితులు. ఆయన భార్యయగు కమలాదేవి మానుషరూపమందిన రమాదేవి. భార్యాభర్త లిరువురును ప్రజలఁ దమ కన్నబిడ్డల లీలఁ జూచుకొనుచుండిరి. ఇఁక నాయూరి ప్రజలు సుఖజీవులని చెప్పుట యతిశయోక్తియగునా?

అది యాదివారము. ఆదిత్యభగవానుఁ డాకసపు మధ్యమున నిల్చి తనశక్తి నన్ని దిశలఁ జూపుచున్నాఁడు. జమీందారుగారి గృహమందు పండ్రెండు గంటలు టోకాయించినారు. పల్లెయంతయు నిశ్శబ్దముగా నుండెను. అంత నెచ్చటినుండి వచ్చినారో కాని పుట్టనుండి వచ్చు చలిచీమలవలె, వర్షము వెనుక వచ్చు నుసుళ్లవలె నూనెగుడ్డల వారు తండోపతండములుగ వచ్చి జమీందారుగారి భవనమున కెదుటనున్న బయలులో దిగిరి. ఓ! ఎచ్చటఁ జూచినను గాడిదెలవీపులపైనుండి సామానుల దింపువారును, ఏదెసఁ బరికించినను చాపలకట్టల విప్పువారును, ఏవైపు తిలకించినను గుడిసెల నమర్చుకొనుటకై గునపములతో గోఁతులఁ ద్రవ్వువారునై యుండి బయలంతయు పశువులసంతఁ జేసిరి. వీరి భాష దెలిసికొనుటకెంతో కష్టము. భావములఁ దెలిసికొనుట మఱింతకష్టము. వీరిచేష్టలన్నియుఁ గడుఁ గ్రూరములు. గ్రద్దలవలెఁ గంటికగపడిన కోడిపిల్లల నెత్తుకొని పోవుటలో మిక్కిలి సమర్థులు. గ్రద్దయైనను దయఁదలఁచి యొక్కపిల్ల నెత్తుకొనిపోవునుగాని వీరొక్కసారిగ వందలకొలఁది నోరెఱుఁగని కోడిపిల్లల నెత్తుకొనిపోవుదురు. చంటిపిల్లలఁగూడ నెత్తుకొనిపోయి తమవృత్తియందు వారిని సమర్థులఁ జేయుదురు. ముష్టియని వంకఁబెట్టుకొని, యింటింటికి తిరిగి, రహస్యములన్నియు గ్రహింతురు. వీరికి వృత్తులవలననే జీవనము జరుగదు. వీరియం దాఁడువారి యార్జన మెండు. ఈయమ్మలు హస్తసాముద్రికము (**Palmistry**) నందు కడునిపుణురాండ్రని యూరిలోని స్త్రీలకందఱకుఁ జాలనమ్మకము. వీరిరాక నెట్లు తెలిసికొనిరో కాని యూరిలోనున్న స్త్రీలటకరుదెంచి గృహమందున్న ముసలివాండ్రకుఁ దెలియకుండఁ దీసికొనివచ్చిన ధన మానూనెగుడ్డల స్త్రీల చేతులలోఁ బడవైచి 'నాకడుపెప్పుడు ఫలించు'నని యడుగువారు కొందఱును, 'నా మగనికి నాపై దయయెన్నఁడు వచ్చు'నని యడుగువారు

కొందఱును—'వానికొక్కడును లభించునా' యని యడు
గువారు కొందఱును—ఇట్లు నానావిధములగు ప్రశ్నలవేసి
ఫలములం గనుంగొనుచుండిరి. ఇఱువదుగురు మగవారొక
చోటంజేరి మాటాడకుండ నుండంగలరు కాని, ఇద్దఱాండు
వారొకచోటంజేరిన నిఁకలోకాభిరామాయణమునకంతముం
డునా? అట్టియెడ వందలకొలంది స్త్రీలొకచోటంజేరిన
నది కూరలంగడియని చెప్పందగదా? ఆయూరి స్త్రీలం
దఱుం దమఫలములం దెలిసికొనుచుం, దమదురదృష్ట
మునకుం జింతిల్లుచుం, దమమగల యప్రయోజకత్వ
ములకు నిట్టూర్పుల నిగుడ్చుచుం, దమతోడి స్త్రీలయదృ
ష్టముల కసూయపడుచు, వచ్చువారును బోవువారునై
యుండిరి. అంత బఱ్ఱుమని మోటారుకారుధ్వని వినం
బడెను.

'జమీందారుగారు వచ్చుచున్నా'రని యూరి
స్త్రీలందఱు సూర్యునిరాక నెఱింగిన చుక్కలవలె
మాయమైరి. కాని నూనెగుడ్డలవారుమాత్ర మచటనే
యుండియన్నముల వండుకొనుచుండిరి. అంత Maxwell
మోటారుకారులోవచ్చి జగన్నాథదాసుగారు తమ
భవనముకడ నాఁగిరి. ఇటునటు నొకమారుచూచిరి.
నూనెగుడ్డలవారిం గాంచిరి. అప్రయత్నముగ నొకవెఱ్ఱి
కేకవేసిరి. కలకలలాడువారి మోమునం దదియేమిపాపమో
కాని కత్తివ్రేటునకైనను రక్తపుంజుక్క లేదు. ఆహా!
ముష్టివారినిజూచి లక్షాధికారి గడగడవడంకుచున్నాండే!
ఆశ్చర్య మాశ్చర్యము! కరినిగాంచి సింహము బెదరునా?
మేకనుజూచి పెద్దపులి వెనుకడుగు వేయునా? (New
York)లోని అరువదిమూండంతస్థులమేడ, పూరిండ్లను
జూచి తలవంచుకొనునా! అవసరమైనప్పుడు వసుదేవుండు
సైతము గాడిదకాళ్ళం బట్టండా?

* * * * *

తడంబడుపాదములతో, వెలవెలబాఱు ముఖముతో దాసు
గారు లోని కరిగిరి. రెండవద్వారము కడం దుపాకుల
బాగుచేయుచున్న మాళవునిజూచి దాసుగారు 'ఏమోయి,
మాళవా! ఈనూనెగుడ్డలవారిట కెపుడువచ్చిరి' అనెను.
అంత మాళవుండు 'రెండుగంటలక్రింద వచ్చిరయ్యా' అని
ప్రత్యుత్తర మిచ్చెను.

దాసు—వారువచ్చుట నీవు చూచితివా?

మాళ—చూచితినయ్యా!

దాసు—చూచినవాండవు నాకేమని చెప్పలేక పోయి
తివా?

మాళ—వారలం బొమ్మనుట నాతరము కాదయ్యా!

దాసు—నిజమే. ప్రభుత్వమువారితోం జెప్పివీరిని 'ప్రాసి
క్యూటు' చేయింపవలయును. ఇట్లనుచు దాసుగారు
లోనికేగిరి. కమలాదేవిగారామె మేనమామగారగు
రఘునాథరావుగారింటికేగెను. గాన జమీందారు
గారు తిన్నగ తమగదిలోనికిం బోయిరి. మాళవుం
డింటికేగెను.

అది శీతకాలము. చలిదేవుండు దంపతులకడ కేగ
లేక నమాయకులగు బ్రహ్మచారులపైం దనశక్తిసామర్థ్య
ములం జూపుచున్నాండు. ప్రజలు పెట్టెలలో భద్రముగ
దాచియుంచిన సాలువులం బైకిదీసి యెండలోం బట్టు
చున్నారు; ఉదయమున జలి కాగలేక చూరునమన్న
యెండుతాటాకుల నూడలాగి చలిమంటలు వైచుకొను
చున్నారు; 'వేడినీళులం గాచలే దెటులస్నానముం జేయు
దుంటి' వని సేవకులపై నెగురుచున్నారు. అట్టి పుండు
వంటి చలికాలమందు, పాపము నూనెగుడ్డలవారు మందు
లోన, నారుబైటను, గప్పుకొనుటకున్నం బ్రక్కకు
లేకుండను, బ్రక్కకున్నం గప్పుకొనుటకు లేకుండ సుఖ
నిద్రం బోవుచుండిరి.

ఓదైవమా! నీవు పక్షపాతబుద్ధిం గలవాండవని
కొందఱు నిన్ను దూషించినను నీవు నిజముగ నందఱియెడ
సమానుండవే. ఏలయనిన, బీదవానిశరీరము చలి కాగునటు
లును, ధనవంతునిశరీర మటులాగలేనటులును, వారి శరీ
రముల విచిత్రముగంజేసితివి! నీచర్య లద్భుతములు గదా!

సీ. పైం గప్పుకొనుటకుం బట్టలేనినరులం
జలిదేవుం డేడ్పింపం జనగలేండు
రెండుచేతులును లేకుండు నరులకాళ్ళు
లే చేతులైకూడ నెసంగుచుండు
తినతిండిలేకున్న జనుని యాకలియొక్క
మంచినీళులతోడ మాయమగును

వాగియా వారలు బాగుగా సంజ్ఞలఁ
జేసి నరులఁ దృప్తిఁ జేయఁగలరు
గీ. ప్రతిస్త్రీయంగమున లోప మెసఁగియున్న
నేజునంగమునందున వెలయు నద్వి
తీయమౌ శక్తి; దేవుని మాయ లెన్నఁ
దరమె, మోహాంబుధినిమునుఁగుచునరుల కహహ!

ఆనాఁటిరాత్రి జగన్నాథదాసుగారు తమగదియందుఁ గూరుచుండి చుట్టఁ గాల్చుకొనుచుండిరి. ఆగదియం దొక గవాక్షముకలదు. ఆగవాక్షమున కెదురుగ నైదరలుగలిగిన బీరువా యొకటి కలదు. అందర నొక్కటిచొప్పున నైదుతుపాకులుండెను. అప్పుడు పదిగంటలగును. చుట్ట నడుమచేతఁ బట్టుకొని, దాసుగారు తాము పూర్వమాచరించినకృత్యములఁ గాంచోలు తలఁచి నిట్టూర్పుల నిగుడ్చుచుండెను. గవాక్షమునుండి చలిగాలి వైచుచుండెను. తలుపులను వేయుటకై దాసుగారు లేచి గవాక్షముగుండ నేమి చూచిరోకాని 'హా! తీర్జావా!' అని యొకనెత్తికేక వైచిరి. ఆగవాక్షముచెంత భయంకరమగు నొకస్త్రీవ్యక్తి నిలుచఁబడియుండెను. ఆకేక విని ఆవ్యక్తి 'ఔను తీర్జానే! నీతోఁ గొన్నిమాట లాడవచ్చితి'ననెను.

దాసు—ఓ నూనెగుడ్డలవ్యక్తీ! నన్ను బ్రదికింపుము. చచ్చినదానవు తిరుగ నెట్లుసిద్ధమైతివి చండాలినీ!

తీర్జా—నాథా! నన్నిట్టిమాట లాడుట మీకున్యాయమేనా? ఇదిగో మన పెండ్లిసమయమున దామొసఁగిన యుంగరము. నాథా! నీయవసరము తీఱినపిదప నన్నీరీతి నేడ్పించుట భావ్యమా! ధర్మపత్ని నిట్లేడ్పించుట ధర్మమా?

దాసు—నాపాలిటి దయ్యమవుగాని ధర్మపత్నివా?

తీర్జా—నేను కోఱినధనము నీ వీయకున్నయెడల నిజముగ నీపాలిటిదయ్యమునే యగుదును.

దాసు—ఓమోహినీ! నీవు నన్నాకర్షించినది సత్యమే. కాని దైవసంకల్పముచే మనము వేఱైతిమి. నీవు వలసినధనము నేనిచ్చెదను. నీవు నీవీయూరు వీడి పోవలయును. అట్లుగానియెడలఁ జంపివైచెదను.

తీర్జా—అటులే యగుఁగాక. (అనిపోవును.)

జగన్నాథదాసుగారు చేత శిరమునిడికొని, చచ్చినదనియెంచిన భార్య తిరుగసిద్ధమగుటచే మూర్ఛావశిష్టులైరి. అంత నొకచేయి గవాక్షముగుండఁ బ్రవేశించి



"రక్షకభటు లదిగో వచ్చుచున్నారు"

మూఁడవయరయందున్న తుపాకిని దొంగిలించెను. మఱొక్కనిముసమునకు 'ఢామ్మ'ను తుపాకిధ్వని వినఁబడెను. మూర్ఛావస్థయందున్న దాసుగారు మేల్కనిరి. ధ్వనివెంట 'చచ్చితివా ఱంకులాఁడి! యను మాటలుగూడ వినవాయెను. దాసుగారీ వాక్యము లెవ్వరివో గ్రహింపఁజాలరైరి. అంతఁ దలుపుగొండెముఁదీసి దాసుగారీవలకు వచ్చిరి. ఆ! అదియేమి వారట్లు నిశ్చేష్టులైయున్నారు!! అచ్చట రెండు నిముసములక్రిందఁ దనతో మాటలాడినవ్యక్తి(తీర్జా) చచ్చిపడియుండెను. జగన్నాథదాసుగారి తుపాకి శవముప్రక్కనుబడియుండెను. అంత నొకనూనెగుడ్డలవాఁ డటకరుదెంచి రోషకషాయితనేత్రుఁడై 'ఓరీ! క్రూరా! నోరెఱుఁగనిబాలనుజంపితివఁటరా?'అనెను.

దాసు—మామా! నే నమాయకుఁడను.

నూనె.గు.వా—అల్లుఁడుగారూ! అమాయకులా మీరు? కానిండు; ప్రతిఫల మనుభవింపకమానరు! రక్షకభటులదిగో వచ్చుచున్నారు.

అంత రక్షకభటు లటకువచ్చి దాసుగారిచేతి కరదండములఁ దగిలించి లాగికొని పోవుచుండిరి. వికటముగ నవ్వుచు, పరమేశ్వరుని విచిత్రలీలల వితర్కించుకొనుచు దాసుగారు వారిని వెన్నంటిపోయిరి.

Wilson Goggles ధరించి న్యాయమూర్తులైన గోపాలరావుగారు, చేతి కరదండములతోనున్న జగన్నాథదాసుగారితోఁ గారాగృహమున నిట్లు మాటలాడుచుండిరి.

గోపా—అయ్యా! మీరేనా నిజముగా Guilty Person?.

దాసు—నే నేపాపమెఱుఁగను.

గోపా—నేనడిగినప్రశ్న యేమి; మీరిచ్చిన Reply యేమి? అంతయు Incoherent.

దాసు—(లోన నవ్వుకొనుచుండును).

గోపా—పోనిండు. చంపఁబడిన యామె మీ భార్యయేనా?

దాసు—ఔను.

గోపా—ఇఁక నేమి? మీ భార్యపై సర్వాధికారముఁ గలవారు కనుక మీరే ఆమెను జంపియుండవలయును. కాన మీరేహంతకులు.

దాసు—అయ్యా! ఆసమయమున నేను నిదురయందుంటిని.

గోపా—ఐన నేమిలెండు. నిదురయందెన్నియో వికృతచేష్టలఁ జేయువారెందఱో కలరు. వారిని ఆంగ్లమున Somnambulists అనెదరు లెండు. తమరా Category లో వారేమో?

దాసు—అయ్యా! అనవసరప్రసంగములఁ జేయక అపరాధపరిశోధకుని నొకనిని బిలిపింపుడు. (నెమ్మదిగా) మీకష్ట మూరకఁ బోనిచ్చువాఁడను గాను.

గోపా— Thanks; Yes! Yes! ఔను! ఔను! You are right; Perfectly right Our duty is only to punish but not to detect. I shall wire for a detective Boy!
(కుఱ్ఱవాఁడు వచ్చును.)

దాసు—(తనలో) ఓరీ! నిర్భాగ్యుఁడా! తెలుఁగున నేడువలేవా?

గోపా—(వ్రాసి) అయ్యా! దాసుగారూ! వినుఁడు.

**Detective Raghunath, Suryaraopet, Cocanada—Your help wanted on the spot please start forth with—Jus ice Gopal**

**Boy** నీ వీ **Telegram** ను **Post office**లో నిచ్చి. **Charges** నా **Clerk**నుండి తీసికొనుము. **Hurry up.**
(తంతివార్తతో కుఱ్ఱవాఁడు పోవును.)

అంత రెండుగంటలలో సుందరాకారుఁడగు నొకపురుషుఁ డటకు వచ్చెను. అతనినిఁజూచి దాసుగారికెందుచేతనో కాని విడుదల కాఁగలనను ధైర్య మొదవెను. అంతదనుకఁ గునికిపాట్లుపడుచున్న గోపాలరావుగారా నూతనపురుషునిఁజూచి 'Oh! A Daniel has come to Judgment I hope' అనెను.

అంత నానూతనపురుషుఁడు " అయ్యా! నేను రఘునాథరావుగారి యొద్దనుండివచ్చితిని. మీ రపరాధపరిశోధకునికొఱకు వ్రాసితిరిగదా!"

గోపా—Yes! Yes! ఔను! ఔను! I mean I wired only for a detective. Excuse me. ఈనడుమ Club లో నలవాటైన Ex shaw No. I చే నా Tenacious memory క్షీణించుచున్నది. I mean A Sherlock Holmes has come to detection' Yes! Yes (తనలో) Oh! Incarnation of Beauty!

నూ. పు.—రఘునాథరావుగా రస్వస్థులై యుండుటచే నన్నంపిరి.

దాసు—(తనలో) నాభార్య మేనమామ రాకుండుటచే-నాకర్మము-విధివ్రాఁతఁదప్పింప నెవరివశము?

గోపా— Alright, You can investigate. I have nothing to do here. I shall take leave, Dear Das! Do not Forget me (నూతనపురుషుని వైపు తిరిగి) "అయ్యా! చిన్నతనమునుండియు, నాంగ్లమున మాటలాడుట లవాటైనది. కాన క్షమింప వేఁడెదను." అని గోపాలరావుగారు పోయిరి.

# క్రోధన సం. మాఘమాసము

## ౪౦-వ జాతీయ మహాసభ-కాన్పూరు



దక్షిణాఫ్రికా రాయబారులనాయకుడు డాక్టరు అబ్దుల్ రహిమాన్‌గారు సభాప్రారంభమున నుపన్యసించుట



౬. తిలకనగరమునం దొక వీధి

క్రోధన సం: మా[illegible]మాసము

౪౦-వ జాతీయమహాసభ-కాన్పూరు



౭. ఖద్దరు ప్రదర్శనశాలయందొక భాగము



౮. ఖద్దరు ప్రదర్శన ప్రారంభమున గాంధీమహాత్ము డుపన్యసించుట



అంత నానూతనపురుషుఁడు దాసుగారివైపునకుఁ దిరిగి "అయ్యా! తామెఱిఁగినది సవిస్తరముగ సెలవీయవేఁడెద" ననెను. దాసుగారు తూచాలుతప్పకుండ జరిగినదంతయుఁ జెప్పెను.

నూ. పు.—దీనినిబట్టిచూడ మీరు నిర్దోషులని తెలియుచున్నది. అయ్యా! తాము తీర్థా నెచ్చట వివాహమాడితిరి?

దాసు—C. B. M. Church, Pithapuram.

నూ. పు.—అయ్యా! మీరు నిర్దోషులనిఋజువుపఱచిన నాకేమిబహుమాన మొసఁగెదరు?

దాసు—అంతటిభాగ్యవంతుఁడనైనయెడలఁ దామకోరిన దిచ్చెదను.

నూ. పు.—సంతోషము. నాకిఁక సెలవు దయచేయుఁడు; అని యానూతనపురుషుఁడు వెడలిపోయెను. దాసుగారు చింతింపుచుఁ గారాగృహమందుఁ గూలఁబడిరి.

౪

ఈనూతనపురుషుఁ డెవఁడోఁకాని మిక్కిలి పట్టుదలతోఁ బనిచేయుచుండెను. జగన్నాథదాసుగారిదాసి యనుమతిపై దాసుగారు హత్యజరిగిననాఁటిరాత్రి కూరుచున్నగదినంతయుఁబరికింపుచుండెను. అరలబీరువాలోమూఁడవయరకును గవాక్షమునకు నున్న దూరముఁ గొలిచికొని వ్రాసికొనెను. గవాక్షము నేలనుండి యెంత యెత్తుగలదో కూడఁ గొలిచికొని వ్రాసికొనెను. ఆవలకుఁబోయి యిట్లని వితర్కింపుకొను చుండెను. "ఆహంతకుని దేహముభుజములవఱకైనఁగోడయం తెత్తుండవలయును. తుపాకి యాగవాక్షముగుండనే దొంగిలింపఁబడి యుండవలయును. ఏలనన్న పోవుటకు దాటి మఱొకటిలేదు. ఆసమయమున ద్వారము లోన గొండ్లెము వేయఁబడియున్నది. జగన్నాథదాసుగారు మూర్ఛావస్థయం దున్నారనిన సంగతి నెఱిఁగియుండి హంతకుఁడు తుపాకిని దొంగిలించియుండవలయును. కాన భార్యాభర్తలసంభాషణ హంతకుడు తప్పక వినియుండవలయును. హంతకునకు తీర్థాకిఁ దప్పక సంబంధముండవలయును. లేనియెడలఁ జంపినతరువాత 'చచ్చితివా లంకులాడి!' అని యఱచియుండఁడు. ఇట్లు వితర్కింపుకొనుచు నేలపై నెవ్వైన యడుగులజాడ కనఁబడునేమోయని నేలనంతయు వేయికన్నులతోఁ బరికించెను.

ఒకచోట military Boots Soles ఆకారము కానవారెను. వానియాకారము నాతఁడు సరిగఁగాగితముపై వ్రాసికొని, తీర్థా తుపాకితోఁ జంపఁబడెనుగావు, తుపాకులసంగతు లెఱింగిన తుపాకులమేస్త్రీపేరు మాళవుఁడని తెలిసికొని వెడలిపోయెను.

మాళవుఁ డప్పుడుకీళ్లనొప్పులచే బాధపడుచుండెను. ఈనూతనపురుషుఁ డీసంగతిఁదెలిసికొని, వైద్యునివేషము ధరించి, మాళవునియింటికరిగి, మాళవునకు మందిచ్చుచున్నవైద్యుఁడు తన్నంపెనని మాళవునకుఁ గబురంపెను. ఒకబాలుఁడు వచ్చి మనఅపరాధపరిశోధకుని లోనికిఁ దీసికొనిపోయెను. పోవుదారిలో నొకగదిలోన military Boots కానఁబడెను. అంత నాతఁడు వాని Soles పరీక్షించెను. జేబులోనున్న కాగితముఁ దీసి దానిపై వ్రాసియున్న Soles ఆకారముతోఁబోల్చి చూచెను. ఆశ్చర్యము! రెండింటి యాకారములు సరిగనుండెను. అంత నాతఁడు లోన నిమపునవ్వు నవ్వుకొనుచు, లోనికిఁ బోయి మాళవునితోఁ గొన్నిమాటలాడి వాని దేహము పొడవును, చేతులపొడవును గనిపట్టి 'తిరిగి దర్శనముఁ జేసికొనెద'నని యీవలకువచ్చి 'ఈతఁడే' అనుకొనుచుఁ బోయెను.

౫

ఒకనాఁటి యుదయమున చేత నొక తంతివార్త నిడికొని సంపూర్ణవిజయదృష్టులతో నీనూతనపురుషుఁడు మాళవునింటికిఁ బోయి 'అయ్యా! మాళవరాయిగారూ! ఇదిగో మీచేతికరవండములఁదగుల్చుచుంటిని. తీర్థాను చంపినవారు మీరే' అనెను. అంత మాళవుఁడు తెల్లపోయి 'ఆఁ! నిజముగ నేనే. ఆఁ! కాదు' అనెను.

నూ. పు.—అయ్యా! మాళవరాయిగారూ! తమరు జగన్నాథదాసుగారి మొదటిభార్య (తీర్థా) చెల్లెలు తీర్థా నొక్కసంవత్సరముక్రితము వివాహమాడియుండలేదా? అంతకుఁబూర్వమే జగన్నాథదాసుగారి భార్యయగు తీర్థా నీటబడి చనిపోలేదా? మీ భార్యయగు తీర్థా హత్యజరిగిననాఁటి రాత్రి జగ

జగన్నాథదాసుగారితో మాటలాడుచున్న డని యనూ యపతి గారు మెను జపము నుద్దేశించి, జగన్నాథదాసు గారు మూర్ఛితులై యున్న సమయమందు, న్నాడవ



"ఆఁ! నిజముగ నేనే."

యరయందున్న తుపాకిని దొంగిలించలేదా? మీ కేల్లు శౌదవుఁ గొలిచికొనుఁడు. గవాక్షమునకు మాండపరుక్షకునున్న దూరమంత సోడేవున్నది. మఱి యు మీరు Military boots తొడుగుకొని గాకృత్య మాచరించితిరి. వాని Soles యాకారము నేలపైఁబడినది. నేను దాని యాకారము సరిగ వ్రాసితిని. మీ Military boots యొక్క Soles ఆకారము, నేను వ్రాసిన యాకారము నొక్కరీతిగ నున్నవి. ఇదిగో! మీరు తీర్ణాను వివాహ మాడినట్లును, ఆమె అక్కయగు తీర్ణాను జగన్నాథదాసుగారు వివాహ మాడినట్లును, ఆమె నీటఁబడి మరణించినట్లును, అక్కచెల్లెం డ్రిరువు రొక్కయాకృతిఁగలవా రటం చును, C.B. M. Church నుండి వచ్చిన తంతి వా రఁజూడుఁడు' అనెను. అంత మాళవుఁడు 'కేయ జాలినదేదియు లేక పశ్చాత్తప్తహృదయుఁడై 'అయ్యో! అపరాధపరిశోధకా! దాసుగారి పూర్వపు సంగతి నా కిసుమంతయుఁ దెలియదు. తెలిసికొనవల సిన యవసరమునాకుఁగూపసలేదు. నాకాసంగతి యింత మాత్రమైనఁ దెలిసియుండిన, నేను కమంచు [illegible] చిరపక నిష్కారణముగా నాభార్య నిట్టి యకాల మృత్యువుపాల నిడియుండను. నాభార్య దాసుగారితో మాటలాడుచున్న సంగతుల విని, దాసుగారిని నాభార్య మొదటు వివాహమాడెననితలంచి, యొడలు దెలియనివాఁడనై, దాసుగారు మూర్ఛయందున్న సమయమందు వారితుపాకిని దొంగిలించి, నాభార్యను నా పాడుచేతులతోఁ జంపి, కసితీరక 'చచ్చితివా' అంకు లాడి' అనియంచి, దాసుగారితుపాకి శవముప్రక్కనఁ బడవైచి తీర్ణా తండ్రి యొద్దకుబోయియతని కుమార్తెను దాసుగారు చంపినారని చెప్పితిని. దాసుగారిని కారాగృహమందుఁద్రోయించితిని. అగ్నిసాక్షిగ వివాహమాడినభార్య పరుని 'నాధా' యని నోరారఁబిలిచినప్పుడు, మగవాఁ డెవ్వఁ డూరకుండఁ గలఁడు! స్వామీ! నేనే నాభార్యను జంపినవాఁడను అనెను.'

మాళవునకుఁ గొలఁదిదినములు కారాగృహశిక్ష విధింపఁబడెను. దాసుగారు నిరపరాధు లగుటచే విడిచి పెట్టఁబడిరి. ఆనూతనపురుషుఁడు దాసుగారి వ్రేలనున్న యుంగరమును బహుమతిగాఁగొని యదృశ్యుఁడాయెను.

## ౬

సీతాకోకచిలుకరెక్కలవలెనున్న వస్త్రమం దొక పాలరాతి తిన్నెపై, జగన్నాథదాసుగారును, ఆయన భార్యయగు కమలాదేవియుఁ గూర్చుండి యీరీతిగ మాటలాడుకొనుచుండిరి.

కమ—నాథా! పెండ్లిసమయమున నేనొసంగిన యుంగరమేది.?

దాసు—ఒకరికిచ్చితిని.

కమ—మఱల నాకొకసవతిని సంపాదించితిరా?

దాసు—లేదు. నాప్రాణరక్షకుఁడగు నపరాధపరిశోధకున కొసఁగితిని.

కమ—అటులైన నాయుంగరము నాకుఁ జూపింపనక్కర లేదు మీభార్యనుగాను.

దాసు—ప్రాణకాంతా!

కమ—అదిగో, తిరుగనట్లు పిలిచెదరు?



"నాథా! ఇదిగో, తిరిగి మఱియొకయుంగరమిచ్చుచుంటిని"

దాసు—ఇచ్చినదానిని దీసికొనుట మంచిపోటివారికిం దగునా?

కమ—అట్టిదియైన నా కాయపరాధపరిశోధకుండే మగండు.

దాసు—అటులనుట భావ్యమా?

కమ—నాథా! ఇదిగో తిరిగి మఱియొక యుంగర మిచ్చుచుంటిని, దీనినైనం బరులకీయక భద్రముగా నుంచుకొనుండు. (ఉంగరమిచ్చును.)

దాసు—(ఉంగరముం జూచి)"ఆం! ఇదియేమి? నీవే నా ప్రాణరక్షణ మొనర్చినదానవు! అపరాధ పరిశోధకుండవు! రఘునాథరావుగారి మేనకోడలవైనందులకు రావుగారి పేరు నిలువంబెట్టితివి. నాప్రాణముల రక్షించితివి. ఆహా! ఏమి నాభాగ్యము!" అంత నలుదెసలం జీకటులు గ్రమ్ముకొను చుండెను. ప్రణయ స్వరూపులగు నాదంపతులు మన కనుపడుట లేదు.



# కుకవి ప్రబోధము

అనంతపంతుల రామలింగస్వామిగారు (భారతీసమితి)

వమును కవులు రచించిన త్రోవ, వనుజను చోకకావ్యమేను వ్రాయుచుం గుకవిన్, పనిపడి తిట్టితి నిదురన్, గనుమూసితి రేయి నొక్క కలంగంటిం గవీ!

మ. కలలోం గాంచితి నంత నొక్క కుకవిన్ గాశ్మీర పుష్పేలువున్
దలంజుట్టెన్, వలకేలం బట్టె నొకపాత్త్రం బానసంబందుం గొం
దలికుం గుంకుమబొట్టుం బెట్టె నొడలంతన్ బూసె భస్మంబు ని
స్తులదృష్టిన్ ననుం గాంచి పల్కె నిటు నాతో నాశం దుద్దాముండై.

"క. కుకవీ! కుకవీ! యంటివి—కుకవీశుండ వీవుంగావా? కుశలకవీశుల్
కుకవీశులు గాకుందురో? కుకవి సుకవి భేద మెంచి కులుకకుము

మ. భళిరా! నాకమునుండి వచ్చితో? కవీ! భూమస్వభావాఢ్యవై
వెలయం జూచెదునట్టి నీ[illegible] లేనిదీ

విల సృష్టించఁగలావా? లేదనుచు నీవెంచుం బదార్థంబు వ
ర్థిలు నెందో సుమ! మానుమా కుకవి నర్థిన్ దిట్టు నీగర్వమున్.

మ. కవి సృష్టించుపదార్థజాలమున నొక్కండీవు, నీపూర్వజ
న్మవిశేషంబు నెఱుంగలేక "కవి నెన్న న్నే నెకా" యంచు గ
ర్వవిదగ్ధుండవు గాకుమోరి! కుకవిప్రాంచత్కుటుంబాన ను
ద్భవ మీ వొందితి వందులో యశము సంపాదించు మోయీ, కవీ!

శా. 'బాణోచ్ఛిష్ట మిదం' జగత్తనెడి యావాక్యార్థతత్త్వంబు హృ
త్కోణావాస మొనర్చుచున్న నిఁక జంకు న్లేక నీవ్రాఁత వి
జ్ఞానానూనవినూత్నమం చనెదవన్నా! హాస్యమో యిద్ది? య
జ్ఞానంబో? మఱిగర్వమో? పలుకుమా! శాంతాంతరంగుండవై.

ఉ. ఒక్కనియర్థ మింకొకరుఁ దుర్విని సంగ్రహణంబు సేయుటే
నిక్కము కానిచోఁ దొలుత నీవు జనించిననాఁడు లేక నీ
కెక్కడనుండివచ్చె నిది యెందుము చౌర్యము లోకనైజమా
నొక్కఁడు చెప్పి చేకొను నికొక్కఁడు చెప్పక సంగ్రహించెడున్.

మ. తనలోపంబుల నాడిపోదు రనుచింతన్ జార మున్ముందు ధా
రుణి సాధ్వీమణులందు లోపముల నేరున్, గాదె తద్రీతి నీ
వును నాదిన్ గుకవిప్రకాండమును నెప్డున్ దిట్ట నుంకింతు, భ
ర్తను దండించి గయాళి ముందు మొగసాలన్ జేరు టిట్లేకదా!

చ. కుకవుల నీవొకండవయి కొంకుటనానను దిట్టు నీదు వా
లక మపహాస్యభాజనము, భ్రాతృవినిందను నీవొనర్చి నా
వకట! కృతాపరాధమున కందుము నీవనుతాప మింక, నీ
కుకవివినిందనంబు నినుఁ గూడెడువైఖరి నేర వేలొకో!"

గీ. ఇంక నేమన నతఁ డెంచెనేమొకాని, యంతఁ గాకములార్చె గృహాంతికమున
నిదుర చెదరెను, మేల్కాంచి నేను నాల్గు, దెసలఁ బరికించి కాననైతిని గుకవిని.






అనగనగా ఒక అబ్బాయి. అత డెంతో అందంగా ఉండేవాడు; షోకుగా ఉండేవాడట.
అలా ఉంటోంటే ఒకపిల్లిపిల్ల చూసింది.



దానికా అబ్బాయిని పెళ్ళాడాలని బుద్ధి పుట్టింది. అందుకోసం తపస్సుచేసి స్త్రీరూపంధరించా లని ఆలోచించింది. అడివిలోకి వెళ్ళిపోయి ఓచెట్టుక్రింద ఒంటికాలిమీద లక్ష్మీదేవిని గురించి తపస్సు చేసింది. లక్ష్మీదేవి ప్రత్యక్షమై ఏం కావా లని అడిగింది.

"తల్లీ! లక్ష్మీదేవీ! నా కాఅందగాణ్ణి పెళ్ళాడాలని ఉంది. నన్ను స్త్రీగా మార్చాలని నా ప్రార్థన" అంది. దానితో 'సరే' నని వెళ్ళిపోయింది లక్ష్మీదేవి.

అతి సుందరమైన స్త్రీరూపం ధరించి ఆపిల్లిపిల్ల ఆ అబ్బాయిని పెళ్ళిచేసుకుంది. పెళ్ళయింది; సుఖంగా కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నారు.



లక్ష్మీదేవి ప్రత్యక్షమై "ఏం కావా"లని అడిగింది

లక్ష్మీదేవికి ఈ పిల్లి స్త్రీకి ఏమైనా బుద్ధిమారిందో లేదో చూద్దామని తోచి ఓ ఎలుకని ఆగదిలోకి విడిచిపెట్టింది. ఆ పూర్వస్వభావం పోక ఆ ఎలుకమీందకి దుమికిం దా అమ్మాయి 'ఇదేమిటా' అని ఆ పెళ్లికొడుకు తుళ్లిపోయి లేచాడు.





లక్ష్మీదేవి నవ్వుకొని 'పిల్లికి స్త్రీగా మారినా బుద్ధి పోకపోతే ఏంలాభం'అనిపిల్లిగా మార్చేసిందిమళ్లీను. పాపం, ఏజాతి కా జాతిగానే ఉండాలనీ, దురాశ కూడదనీ, ఆపిల్లి పిల్లిగానే ఉండిపోయి సుఖంగా కాలం గడిపిందట.

[కమల]



# చేమంతులు

సెట్టి లక్ష్మీనరసింహము గారు



సంతోషము నీ కీసం
  క్రాంతి మహోత్సవమునందుఁ గలుగంగాన
త్యంతముఁ గోరుచు నీ చే
మంతు లనిపినాఁడ నరయుమా ప్రియమార౯.

౧. శ్రీమంతంబుగ స్వాంతముల్ వికసిల౯ నేమంతిసీమంతినుల్
హేమంతుండను కాంతు రాకకును నెంతే వింత మీర౯ వసీ
భూమి౯ మేన నలంకరించుకొను కెంపుల్, నీలముల్, వజ్రముల్,
గోమేధంబులు నాఁ జెలంగెఁ బలురంగుల్ గల్గు పుష్పావళుల్.

మ్మ్రాను దర్తితకు వేగిరంబుగ సహః కృత్యంబులన్ మాని పె
ల్చన నిద్రించుచు వేకువన్ మిగుల నాలస్యంబుగా నిద్ర మే
ల్కాంచఁగాఁ గారణమైన యీచలికి రంగుల్ గల్గు మేల్ సేలువం
గొని యుద్యానము కప్పుకొన్న దనన్ గుల్కున్ వింత చేమంతులన్.

సీ. పసుపును నెమ్మేన మిసిమిగల్గు విధాన, రాచుకొనిన ప్రియురాండ్రఁ దలఁచి
కుంకుమపుం బొట్టు గొనబారఁగాఁ బెట్టుకొను మురిపెంపు భామినులఁ దలఁచి
కన్దోయికిం గాటుకం గరంబుగ నీటుమైఁ దాల్చు ముద్దుగుమ్మలను దలఁచి
యచ్చంపుఁ దెలిచీర లతివిలాసంబార, ధరియించు ప్రాణకాంతలను దలఁచి,

గీ. యభిలషింతురు హస్తంబులందుఁ దాల్ప, వృక్షముల నిల్ప రమ్యోపవనము లందుఁ
దనరు పీతరక్తవినీల ధవళవర్ణ, కలిత సేమంతిపుష్పముల్ గను రసికులు.

సీ. కను జారులకు నోరు కడునూరు నన మీఱు, మధురంబులగు తమ యధరములను
ఘనజాలముల నీలతను నేలఁ దగి చాల, నుంగరమ్ములయిన ముంగురులను
దెలివన్నె గల వెన్నెలల చిన్నెలను మున్నె, దోసంబులెంచెడి హాసములను
నును మొవ్వులను బువ్వులను జివ్వనను నవ్వు, భంగి మార్దవమొప్పు సంగములను

గీ. మీఱునని తలఁదాలిచి గౌరవింతు, రింతు లారామసీమల నెఱుపు నీలి
వన్నె, తెల్లందనంబుఁ గ్రొంబసుపు రంగె,సంగు చేమంతులం గని సంతసమున.

ఉ. ఎంతశిరంబు మూరుకొని యెంతగ నెక్కొనఁ జేర్చుకొన్నఁ జే
మంతులమీఁది ప్రేమ విటమండలికిన్ నెఱసున్నయే; సతుల్
బంతులు కట్టి యువ్విళు ధమపైబడి శిక్ష యొనర్చునంచు లో
నెంతయుఁ గిన్కఁబూని సలియింతురు వానిని ........

గీ. బంతిపూలు చేమంతుల పగిది వన్నె,చిన్నెలున్నను, వాసనల్ చేకుఱమి వి
టీవిటావళిఁ దనియింపలేవుగాన, బంతులయి వారిఁ దనుపుఁ జేమంతిపూలె.

గీ. పెద్దవయ్యు బంతులు చిన్నపిల్లల జడ, లందె ముడువంగఁబడుఁ; జిన్నవయ్యు జవ్వ
నుల సిగలయందుఁ జేమంతు లలరుచుండు, జన్మవాసన లూరక చనవు కాదె!

ఉ. కాంతల చెక్కులంచుఁ గసికాటులచే రసికుల్ కలంపఁగా
గొంతభయంబు గొల్ప ములుగోళ్లను అక్కు గులాబు; లంగవి
భ్రాంతిని ముట్టి, మూరుకొని, రాపిడి పెట్టిన మాఱులేక, సే
మంతి లతాంతముల్ తలల్ మాత్రము వంచును లజ్జపెంపునన్.

లయగ్రాహి

కంతుఁ డిపు డేయుటకుఁ గుంతములివే; సిగల నింతులు దళంబుగ ధరింతు రివియే; శ్రీ
మంతులకు శయ్యలివె; కాంత లపరాధులగు కాంతులను గొట్టుటకు బంతు లివియే; హే
మంతమునఁ దక్కిన లతాంతములు లేవనుచుఁ జింతిలఁగ నేటికి? వనాంతరములన్ సే
మంతిసుమమంజరులు వింతలుగఁ బూచి కడు సంతసమిడున్ రసికసంతతికి నెల్లన్.

---



# వాడే వీడు

మంచికలపాటి శంకరరావు గారు

## ౧

కల్యాణరావు—ప్యూన్, గంగులూ!

గంగులు—సామీ!

క—ఈ కాగితములు తీసికొనిపోయి గుమాస్తా దీక్షితులవారి టేబిల్ మీద నుంచరా.

గం—చిత్తము.

(ఆని కాగితములను తీసికొనిపోయి దీక్షితులవారి బల్లమీద పెట్టును.)

దీక్షితులు—ఒరే గంగులుగా! ఎంత అన్యాయమురా, మాలవాడివి. ఈవిధమున మాదగ్గరకువస్తే ఎట్లరా. కాగితములు తెచ్చి దూరమునుండి బల్లమీద పెట్టరాదా! ఈబైండుబుక్కులకన్నిటికి అంటు గుడ్డలతో తగలబడ్డవే! నీవు వీటి దగ్గిరకువస్తే వానిని తడుపకుండ మరల ముట్టుకొను టెట్లురా! నిన్ననుకొను టేమి? నిన్ను 'అప్పాయింటు' చేసిన ఆ ఆఫీసరు ననుకొనవలె.

గం—సామీ! మీ రిట్లా శెలవిస్తారే; నేను తమ ఆఫీసుప్యూన్‌నుగదా; తమదగ్గర రాకుండ పనిచేసేది యెట్లనండి?

దీ—చేయలేకపోతే రాజీనామా గోకి పారవేసి వెళ్లరాదూ! మాలవాడివి నీవు మా మధ్య తిరుగుతుంటే మేమెట్లు చూస్తూ ఉంటామురా!

గం—సామీ! తమందరూ ఇట్లా కోపం చేసుకుంటే మాబోటివాండ్లు ఎట్లాగండి బ్రతికేది. ఇంతమంది గుమాస్తాలదగ్గరకు పోతున్నాను గాని వారు మీవాలె కోప పడరే. తుదకు మన అవధానులుగారు కూడ ఇట్లా అనడంలేదే! బ్రాహ్మ లందరికంటె అధికబ్రాహ్మలుగా నున్నారే!

దీ—(మహాగ్రహముతో) ఫూల్! నోటికి వచ్చినట్లల్లా వదరుతావేమిరా! వాండ్లకిష్టమైతే నాకేమి? అధికప్రసంగము చేసితివో నీమీద 'నోట్' వ్రాసి నిన్ను క్షణంలో డిస్‌మిస్ చేయించుతాను చూడు! వాడూ వీడూ అనుకున్నావా యేమి? జాగ్రత్త!

గం—అబ్బా! వాడూ వీడూ అని నేనెందు కనుకుంటాను సామీ! మీరు దీక్షితులు గారు కదూ, తమకు నామీద ఇంత కోపం ఎందుకండీ! రాతచాలక కులమున తక్కువైన జమానునౌకరి చేయవచ్చినా నని కాబోలు! అదే నేను ఏమెట్రిక్ లేపన్నో, ఏ బియ్యేనో అయితే మీ సరి గుమాస్తాగా వచ్చియుంటే మీరే నాకు

గుడ్ మార్నింగులు, షేక్ హ్యాండ్లు చేయరూ! మమ్మింత అనాదరణ చేస్తే మీ కేమి లాభమండీ, సామీ! భగవంతుండొకండే లేండి సామీ! మన మందరం ఆయన బిడ్డలమే కదటండీ!

దీ—చాలునయ్యా గంగులుగారూ! నాబల్ల దగ్గరనుంచి అవతలపోండి. నాకు మీ వేదాంతం పనిలేదు లేండి. మీ సరివారికి పోయి చెప్పుకోండి.

గం—చిత్తము సామీ! ఆరునెలల నుంచి యీ కాకినాడలో ఉంటే యమబాధగా ఉన్నది. ఈ ఆఫీసు జమానుపని నాకింక వద్దు. నూరురూపాయల జీతగాడికిగూడ యీద బాయింపు తాళుకోవడం కష్టం.

నాగరాజరావు—సార్, దీక్షితులు గారూ! వాండేమిటి పుర్యాను. వాడితో యేందండీ! ఏమి ఇప్పుడు వాడు మాలవాడైతే? వాడునూ మనవలె మానవుడుగదా! ప్రపంచమున మనకెంత స్వాతంత్ర్యమో వాడికిమాత్రం అంత లేదా? ఆఫీసుకువచ్చి నతర్వాత ఇన్ని పెట్టుకుంటే జరుగునా?

దీ—సార్, నాగరాజరావుగారూ! ఎక్స్క్యూస్ మి; చాలు, వానిపై మీకంత ప్రేమ ఉంటే మీయింటికి దీసికొనిపోయి మీతో భోజనం పెట్టండి. మీ ప్రక్కలపై నిదుర పుచ్చండి. నా కిష్టంలేదు. పోవోయి, గంగులూ! నాదగ్గరకు రావద్దు ఇక.

గం—సామీ! తమబాధ దినానికి దినానికి ఎక్కువగా ఉన్నది. నౌకరిలేకున్న పీడ బోయింది కాని మీ యమబాధ వదిలితే చాలునండీ! నేబోయి నాతాతకొద్దికాలం గడపుకొంటాను. మావాండ్లంతా నౌకరీ చేసిబ్రతకలేదు. మూడిండ్లు మూకుడుల్తో ముష్టిఎత్తుకుంటానుగాని మీనౌకరిమీరు తీసుకోండి. ఇదిగో, రాజీనామా కాగితం. ఇంక మీరు బ్రాహ్మలనే జమానులుగా పెట్టుకొని పనిచేయించుకోండి. (అని పటాలున జేబులో కాగితం తీసి అచ్చటనే రాజీనామా వ్రాసి దీక్షితులవారి చేతి కిచ్చి) సామీ! గుడ్ మార్నింగు, తహశీల్దారువారు క్యాంపునుండి రాగానే వారి కిచ్చుకోండి. సబ్ కలెక్టరువారు నాకీ తాలూకాలోనే నౌకరిచ్చి పుణ్యము కట్టుకున్నారు. మహారాజులు మీరావి తాల్చి మట్టికొట్టినారు నానోట. నే పోతున్నాను. మీరుమాత్రం నేరుగా దేవుణ్ణి చేరుకోండి. (అని ఏమేమో గొణుగుకొంటూ బయలుదేరెను).

దీ—ఒరే! జాస్తిగావదరకు. మాట్లాడితివో, ఆఫీసునుండి 'నెక్ అవుట్'చేయిస్తా; జాగ్రత. నీవు మా ఆఫీసువదలితే మాకీడ వదలినట్లే. (అని ఇవతలికి వచ్చి తల తడుపుకుంటూ) అబ్బ! ఎంతఅన్యాయం. మాల మాదిగలకు నౌకర్లిచ్చి మమ్ముల చంపుతారు. కులము లేదు, గోత్రము లేదు. కాలము నాశనం అయిపొయ్యే రోజులు వచ్చినవి. వీడిపోరుపడలేక వీనితో తగవులాడలేక నాఅస్థు లడగిపోయినవి. ఈ నాటితో సుఖమయినది. అయినా మరీ

మాలవాండ్లు మనమూ ఒకటైపోతుంటే;
అబ్బబ్బా! ఏమికాలవైపరీత్యము !!!

౨

(ఒక బంగళా)

నాటకమోహనరర్—బాయ్! రాబిన్! ఏమి చేస్తున్నావ్, బజారుకుపోయి, రోజర్ అండ్ బ్రదర్సులో మూడు లైమ్‌జ్యూసులు, 'టూ పౌండ్స్' అయిస్ తీసుకొనిరా

రాబిన్—చిత్తము. (అని బజారుకుపోయి లైంజ్యూసులు, అయిసు తెచ్చియిచ్చును.)

నా.క.—రాబిన్! పైప్ తే.

రా—చిత్తం, సార్! (అని పైపు తెచ్చును.)

(దొరగారు అయిస్ వేసుకొని లైంజ్యూస్ త్రాగి పైపుముట్టించి పీల్చి, గడియారము 11 కొట్టు, రాబిన్ లాగుచుండిన పంకానుండి గాలి చల్లగా వీచుచుండ స్ప్రింగు కాట్ పై బరుండి నిదురించుచుండును.)

దొరగారు నిదురించుటచూచి రాబిన్ లేచి ఆవలకుబోయి తనుత్తుతీర్చుకొని బంగళా కాంపౌండులోని ఒకవట వృక్షచ్ఛాయ శయనించి తనలో తా నిట్లనుకొన ప్రారంభించెను—"అసహాయులకును, దీనులకును దైవ మొక్కడేకదా దిక్కు. ఎంత కులహీనులైనను, మానవులకు దేవుడు కాలము మంచిదైనచో సహాయముచేయక వదలునా! ఔరా! వానిప్రేమ? నేను హీనజాతివాడనైనను, నేర్పున కొద్ది వాడనైనను దేవుడు నాయందు కరుణ చూపుచున్నవాడు. దీక్షితులుగారు నన్ను నిందించి నిరాకరించినను దేవుడు నన్ను దయ జూచెను. ఇన్నిటికిని అదృష్టము నెవరు తప్పింపగలరు? దీక్షితులుగారి దబాయింపుపోయి దొరగారియింట నాకు కొంత సౌఖ్యము సమకూరినది. దొరగారికి నాయెడ అనురాగము క్షీణించకుండునట్లు పరమాత్ముడు నాకు తోడ్పడునుగాక!"

సా.క.—బాయ్ రాబిన్!

రా—సార్!

సా.క.—కమ్!

రా—చిత్తము. (అని వచ్చి యిచ్చును.)

సా.క.—(టీత్రాగి) రాబిన్! నీకు చదువు నేర్చుకొన నిష్టమా!

రా—(ప్రీతితో) యస్, సార్!

సా.క.—నీ వెన్నిక్లాసులు చదివినావు?

రా—లోయర్ సెకండరీక్లాసు చేసినాను, సర్.

సా.క.—సరే! రేపు నిన్ను ఈయూరిలో హైస్కూలులో చేర్చుతాను, నాదగ్గరనే యుండి నీవు చదువుకో! (అనిచెప్పి దొరగారు రాబిన్‌యొక్క బుద్ధికుశలతకును జిజ్ఞాసకును సంతోషించి మరు నాడే హైస్కూలులో రాబిన్‌ను ఫోర్తు ఫారములో ప్రవేశపెట్టిరి.)

రాబిన్ ప్రతిసంవత్సరమును పరీక్షలో జయము గాంచుచుండెను. మెట్రిక్యులేషన్ పరీక్షలో సామాన్యజయమేకాక ఆంగ్లవ్యాసరచనాస్వర్ణపతకవిరాజితు డయ్యెను. ఈ విధమున రాబిన్ వృద్ధికివచ్చుట చూచి దొరగారు

ఆతని ఇంటర్ మీడియట్ కు మద్రాసునకు పంపిరి. కాలేజీక్లాసులయందు సైతము రాబిన్ అగ్రస్థానమున జయముగాంచుచు దైవవశమున బి. ఏ. పరీక్షను ఆంగ్లమున మద్రాసు విశ్వవిద్యాలయమున కెల్లను ప్రథముడుగా నుత్తీర్ణు డయ్యెను. ఇప్పుడు రాబిన్ కు ఇరువదినాల్గు వత్సరములు.

రాబిన్ కుల్లీనువా డగుటచేతను, విద్యయం దసమానప్రజ్ఞగలవా డగుటచేతను సాల్టుకమీషనరుకు రాబిన్‌ను ఒక గొప్పవానిని జేయ దలంపు కలిగెను. దీనికి దోడుగా ప్రభుత్వమువారే రాబిన్ యొక్క ప్రజ్ఞావిశేషములకు సంతసించి తమ పోషణక్రింద అతనిని ఐ. సి. యస్. పరీక్షకై లండనునగరమునకంప తీర్మానించిరి. ఈవిషయము సాల్టుకమీషనరుగారు విని పడినసంతోషము వర్ణనాతీతము. అపుడే దొరగారు రాబిన్‌ను పిలువనంపి ఆతనికి ఆతిథ్య మొసంగి, చేతనైనంత ధనసాహాయ్యముచేసి, లండనువిషయము కొంత తెల్పి తనయాశీర్వచనములతో వీడుకొల్పెను. రాబిన్ మాతృభూమిని వదలుటకు గొంత చింతించియు విధ్యుక్తధర్మముగా నేర్పడిన తన విదేశయానమునకు సంసిద్ధుడై బయలుదేరెను.

## 3

[కాకినాడపురమున కలెక్టరుగారి బంగళా]

దీక్షితులు—(అప్లికేషన్ తీసికొని బంగాళాలోనికివచ్చి బట్లరునుచూచి) సార్, గుడ్ మార్నింగు.

బట్లరు—హుబూ, యు ?

దీ—నే నీరేంజీ రివిన్యూ ఇన్స్పెక్టరును; బహుకుటుంబిని. చాలకాలమునుండి ఈయూరి తాలూకాకచ్చేరిలో 'రాటన్' అవుతుంది రెండేండ్లనుండి రెవిన్యూ ఇన్స్పెక్టరుగా పనిచేయుచుంటిని. ప్రస్తుత మొక హెడ్ అకౌంటెంట్ పోస్టు ఇచ్చటనే ఖాళీ ఉన్నదండీ. అది నా కిప్పించితిరేని మీాన్న నాకుటుంబం నిలుస్తుంది. ఆపుణ్యాం కట్టుకోవలె.

బ—ఆల్ రైట్, మ్యాటర్స్ వెరి లిటిల్, మై రివ్వార్డ్?

దీ—ఓయస్!

బ—టిప్.

దీ—సార్! అంతకు ఆగలేనండీ. ఫయిన్.

బ—గోగో, ఐడోంట్ వాంట్ (అని పోబోవును).

దీ—(పోవు బట్లరునుపిలిచి బేరమాడి తుదకు సైన్ యపీసుకు ఒప్పుకొనెను. బట్లరుపోయి ఫ్యాన్ ద్వారా విసిటింగు కార్డు దొరగారికి పంపెను).

కలెక్టరు—యస్, లెట్ హిం కమ్.

దీక్షితులు—(మహావినయముతో ప్రవేశించి 'గుడ్ మార్నింగుసార్'అని అర్జీ యిచ్చును)

క—(అర్జీ చదువుకొని తనయెదుట నున్న వానిని ఎన్నడో చూచినట్లు తోప, వాని నాపాదమస్తకము పరిశీలించి) వాటీస్ యువర్ నేమ్?

దీ—ఆర్. దీక్షితులు.

క—యస్, డూ యూ బిలాంగ్ టు దిస్ ప్లేస్?

కి—యస్, యువరానర్.

క—(తనప్రాతదీక్షితులు స్మృతికిరా, వానిని గూర్చి కొంత యాలోచించి, తత్క్షణమే మేజాపైని ఫౌంటెన్‌పెన్ దీసి తటాలున చినచినమని దీక్షితులుగారి అప్లికేషన్ మీద ఏమోవ్రాసి) "ఆల్‌రైట్, దీక్షితులూ, యు మే గో నౌ!" అనెను.

దీక్షితులు బైటికిరాగానే బట్లరు ఎదురువచ్చెను. (బలవంతముగా శ్రీదీక్షితులుగారు జేబునుండి వెండినాణెములు తీసి కన్నెటితో వానిని పడవేయుచు టంగుటంగుమని ఎంచి యమకింకరునివలెను నిలిచియున్న బట్లరు చేతిలోనుంచి), "అయ్యా! కార్యమేమో కాలేదు. జేబుమాత్రము ఖాళీ అయిపోయినది" అనెను.

బట్లరు—వాట్ సార్, నో ఫియర్ పేపర్ నా; దేర్ యస్ పుట్ కలెక్టర్.

ఈమాటలకు దీక్షితులుగారికి కొంత హృదయము శాంతించెను. అయినను మనసునకు పూర్తిగా స్వాస్థ్యము కుదరలేదు. మెల్లగా నిజగృహముచేరెను.

రాత్రియంతయు దీక్షితులు జాగరము చేయుచుండెను. మనసు నిలుకడలేదయ్యెను. ఇంతలో నుదయమయ్యెను. గడియారము పదిగంటలు కొట్టెను. పోస్టుమ్యా నొకడు వాకిట కేకవేసెను. దీక్షితులుగారు అత్యాతురముగాపోయి సర్వీసుబిళ్లలతో నలంకరింపబడిన కవరు నొకటిని తీసికొని, చించి లోనున్న సూపెరిటన్ ఆర్డరు నీక్రిందివిధముగ జదువుకొనెను.

Collector's Office.

D. Dis. 859. Cocoanada.
20—9—25

Service order

To
M R. Ry. R. Deekshitulu,
R. I., Cocoanada Range,
Cocoanada.

Ref His Arzi No 562; Subject: application for a Hd. accountant's place

Order

M R. Ry R Deekshitulu, R. I., Cocoanada is appointed to be the Tq. Head accountant, Cocoanada, on Rs 100/- v-s, M R. Ry P. Bhaskara Row, retired —to join forth with.

R. Robin.
Collector.

Copy to T. D C
" " R. D. O.
" " Tahsildar.
" " Party
" " file

దీనిని చదివినంతనే దీక్షితులుగారి ఆనంద మేమని వర్ణింపవచ్చును. ఆహా! ఏమి కృతజ్ఞత! ఏమివిశ్వాసము.

ఆనాడు సాయంసమయమున దీక్షితులుగారు తనమిత్రవర్గముతో బీచ్ వంకకు పయనమాయెను. తత్సమయసంభాషణలో దీక్షితులుగారి సర్వీస్ఆర్డరును గురించి కొంతచర్చ జరిగెను.

దీ—అయ్యో, కల్యాణరావుగారూ! ఈయూరి కలెక్టరు క్రొత్తగా వచ్చియున్నారే వారు మిగుల కరుణార్ద్రహృదయులైన ట్లున్నదండీ. వీరివృత్తాంతము ఎవ్వరికిని తెలిసినట్లు లేదు.

కళ్యాణరావు—వాట్ సార్! వీడిసంగతి నాకు తెలుసును. పది పదునారు సంవత్సరముల క్రిందట వీడొకపేదమాలవాడట. మన రంగరాయశాస్త్రిలవారు చెప్పడంచూస్తే వీడెప్పుడో మనఆఫీసులోనే కొద్దిరోజులు జమానుపనిచేసినట్టున్నది కూడాను. అది మాత్రం నమ్మడానికి లేకుండా వున్నది. ఇంకా ఆయన చెప్పడంలో ఎవరో గుమాస్తా దబాయిస్తే వీడు రాజీనామా యిచ్చి పోయి ఎక్కడనో ఒక ఆంగ్లోయిండియన్ దొర దగ్గరచేరి వృద్ధికివచ్చినట్టు చెప్తాడు. వీడిపేరు గంగులుగాడట మొట్టమొదట. ఏమియేమో ఎవరికి తెల్సు.

ఈమాటలు దీక్షితులుగారు వినుటతోడనే ఏదో సాకుచెప్పి మిత్రబృందమును వీడి త్వరితముగా గృహోన్ముఖుడై యిల్లు చేరెను. చేరి తనగదిలో 'యీజీచేర్' మీద వ్రాలి యిట్లు తనలో చింతింప దొడంగెను :—

"ఔను!! వాడే వీడు."

కట్టా! నే నెంతపాపాత్ముడను. నాన్న, నే నిరాకరించినను, మహోదారస్వభావుడై నన్నెంతసన్మానించెను; నాకెంత మహోపకార మొనర్చెను! మాలవాడని వీని నే నెంతగ దూలనాడితిని. వాడాదినమున నుడివినట్లు నేను వీనికి గుడ్ మార్నింగు చేసి గులామును గాలేదా! అయ్యో! బ్రాహ్మణుడనైన నాతెలివి కన్న పంచముడైన వీనితెలివి వెయ్యిరెట్లెక్కువగ నున్నదే! దైవమున కొకరెక్కువగను, మరొక్కరు తక్కువగను ఉందురా! ఆనాడు నేనెంత త్వరపడితిని! బ్రాహ్మణత్వమున జేసి గర్వించితిని. గుణము ప్రధానము గదా! కులమున హీనుడైనను వాని కట్టి యుదారబుద్ధి సర్వేశ్వరుడు ప్రసాదించెను.

"కలశాబ్ధిఁ బుట్టదే కాలకూటంబు;
కులము ప్రధానమే గుణము లేకున్న!"

# మధుపము

శ్రీ రాజా వాసిరెడ్డి దుర్గా సదాశివేశ్వర ప్రసాద బహద్దరుగారు

క్రపి కుమారకు లొకక్రొత్త కావ్యవనము
సాకుచున్నారు నేడందుఁ జవులు లేని
వాసనలులేని పువుఁదీగ లేసరేగు
చుండె నటు పోకు నీయాస దండుగగును.

తీపులం బెక్కు తెఱఁగులు తెలియు నీకు
మధురగాన మెఱుంగుదు మధుపరాజ!
కమ్మనగు పుష్పరస మాని జుమ్ముమనుచుఁ
బొడుచుండు మీ ప్రాదోటబాటఁబట్టి

వర్ణవైభవమాత్రాన వార్త కెక్కు
లతలదరి నీవు రసలుబ్ధమతిఁ జరింపఁ
బోవ భ్రమతమూ, సుఖపడఁబోవు నీవు
బేలుపడుదురు నీచేతఁ బెక్కు రింక.

# శివాజీ మహారాజు - రామదాసు *

ఆలూరు హనుమంతరావు గారు, బి. ఏ., యల్. టి.,

అక్బరుచక్రవర్తికాలమునుండి షాజహాను మరణమువఱకును మొఘల్‌సామ్రాజ్యము నిరాతంకముగ సాగినది. ఈచక్రవర్తిత్రయకాలములో సామ్రాజ్య మత్యున్నతస్థితియం దుండెను. వీరలశౌర్య మప్రతిహతము; వైభవ మసమానము. ఇమ్మహాచక్రవర్తుల ధర్మనిరతబుద్ధియే సామ్రాజ్యమునకు మూలముగా నుండెను. జాతిమతవైషమ్యరాహిత్యము, ప్రజాపాలనమందు సమదృష్టి, హిందువులయం దనురాగము, వీరాగ్రేసరు లగు రాజపుత్రులతోడి సఖ్యము—ఇవియే వీరి యాశయములు.

ఔరంగజేబు ఢిల్లీసింహాసన మెక్కెను. అతని యాశయములు వేఱు. సున్నీముసల్మాను మతమే శ్రేష్ఠమనియు, మోక్షదాయకమనియు అతఁడు తలఁచెను. హిందువులు విగ్రహారాధకులు, కాఁబట్టి శిక్షార్హులు. వీరల దేవాలయములు అసహ్యకరములు; అపవిత్రములు. దానంజేసి, వీనిని బడఁగొట్టవలయును. ఇట్టి యభిప్రాయములు గలవాఁ డగుటచే ఈతనికాలమందు హిందూమతమునకు, హిందూధర్మములకు, హిందూస్వాతంత్ర్యమునకు దుర్దశ సంభవించెను. ధర్మయుక్తములైన మొదటియాశయము లడుగంటెను; అధర్మము ప్రబలెను; జాతిమతవైషమ్యము హెచ్చసాగెను. హిందువు లత్యంతహేయమైన జిజ్యా లేక జుట్టుపన్నుకు లోఁబడిరి.

ధర్మరక్షణార్థము భగవంతుఁడు శివాజీ మహారాజును బుట్టించెను. హిందూమతధర్మములను, హిందూస్వాతంత్ర్యమును, గోబ్రాహ్మణులను రక్షించెద నని దీక్షవహించిన శూరాగ్రేసరుఁ డీశివాజీమహారాజు. ధర్మమార్గమును వీడిన ఔరంగజేబుయొక్క గర్వనిర్వాపణముఁ జేసిన శౌర్యధుర్యుఁ డీ శివాజీ మహారాజు.

ఒక్కనాఁడు శివాజీమహారాజు భావికార్యక్రమాలోచనాపరవశుఁడై రేగఢ్‌దుర్గములోఁ దనభవనమందుఁ గూర్చుండియుండెను. ఈతని హృదయమందలి యభిప్రాయములను, ఆశయములను గ్రహింపఁగలవా రొక్కరిద్దఱుమాత్ర ముండిరి. అందఱి కీతని హృద్గతాభిప్రాయము లెట్లు తేటపడఁగలవు? ఎట్లు

* ఈ వ్యాసమున కాధారము 1911-వ సం. మార్చినెల సి. హెచ్. సి. మాసపత్రికయందుఁ బ్రకటింపఁబడిన “శివాజీ—రామదాసు” అను చిన్న వ్యాసము.

వ్యాప్తిచేయఁగలఁడు? హిందూసామ్రాజ్యస్థాపనము, హిందూధర్మరక్షణము, అధర్మనాశనము—ఇవియే ఈతని జీవితాశయములు. సామ్రాజ్యస్థాపనకర్మదీక్షామగ్నుఁడై యుండ "జయజయ రఘువీర సమర్థ" యను తన గురువైన రామదాసుగీత మతనివీనులఁబడెను. ఆక్షణముననే శివాజీమహారాజు భక్తిపరవశుఁడై బయటికేగి, గురువునకు నమస్కరించి, గారవమున దోడ్కొనివచ్చి సుఖాసీనుం జేసెను.

"పుత్రా! నీకు సేమమా? సర్వము ననుకూలముగ నున్నదిగదా?" యని మందహాసముతో రామదాసుఁడు శివాజీ నడిగెను.

"శ్రీరామభక్తవర్యు లగు మీ యాశీర్వాదబలముండ సేమముతప్ప వేఱుండునా? మీసందర్శనముచే మామనోవ్యథలు,కొఱంతలన్నియును దీఱును! మిమ్ముఁ జూచు భాగ్యము మాపూర్వజన్మకృత పరిపాకంబుచేఁ గాక లభింపఁజాల"దని శివాజీ సవినయముగా నుడివెను.

"నీమానసంబులో నేకొఱంత లేదని విని చాల సంతసమాయెను. భిక్షుఱుమ్ము. ప్రతిదినభిక్షాటన మున్నదిగదా మాకు?"

మాఱుమాటాడక శివాజీమహారాజు లోపలికివెళ్లి, త్వరలోఁ గాగితములకట్ట నొకటినితెచ్చి రామదాసుని వస్త్రములో నునిచెను.

ఆశ్చర్యమగ్నుఁడై రామదాసు, "ఇదేమి?" అని యడిగెను.

"ఇదివఱకును నేను జ[illegible] పత్రము లివి. నాసర్వస్వము మీయాధీనము. మీ కర్పించియున్నాను. కావలసినది చేయుఁడు. ఇవితప్ప వేఱొండు మీకియ్యఁజాలను. వీనికంటె నెక్కుడు నాయొద్ద లే"దని శివాజీ మిక్కిలి భక్తితో నుడివెను.

శిష్యుఁడగు శివాజీమహారాజుయొక్క ధర్మానురక్తియును, సంపూర్ణస్వార్థత్యాగమును, కర్మదీక్షయును, కర్మఫలమునందు విరక్తియును గని రామదాసుఁ డపరిమితానందకందళితహృదయుఁడై శిష్యుని వీపును దట్టుచు నిట్లనియె.

"శివబా! తాపసులకు రాజ్యమెందులకు? మేము మాసర్వస్వముఁ ద్యజింపవలయును గదా! భిక్షువునకు సామ్రాజ్యపదవియా? ప్రాణాధారమునకుఁ బిడికెడు బియ్యము



ఆశ్చర్యమగ్నుఁడై రామదాసు "ఇదేమి?" అని యడిగెను.



**1200** సంవత్సరములకు ముందు ప్రసిద్ధమయి యుండిన బ్రాహ్మణబాదను పట్టణమున ద్రవ్వబడిన గాజు చెంబు. నీలవర్ణము గల గాజుతో చేయబడి పైన పింగాణిపూత వేయబడినది. పింగాణిపూత చాలభాగము పోయినది. ఇది నిజమైన పరిమాణమునకు రెండురెట్లు పెద్దదిగా నున్నది.

చాలదా? ఇతరులకు జ్ఞానోపదేశము చేయుటయే మాపవిత్రకృత్యము. నీవు నా కొసఁగించిన గౌరవమున కెంతయు ముదమందితి; నీభక్తికి మెచ్చితి. నీవు మహారాష్ట్రసామ్రాజ్యపరిపాలనమున కత్యంతార్హుఁడవు. ఈజయపత్రములను నీవతీసికొనుము. నా కివి నిష్ప్రయోజనములు."

"ఇచ్చినదానిని మరలదీసికొనను. తీసికొన్న క్షత్రియధర్మమునకు విరుద్ధముగ నడచినట్లగును. జయపత్రము లిప్పుడు మీయవి" అని శివాజీ నొక్కి చెప్పెను.

"అట్లయిన, నీబహుమాన మంగీకరించితి. రాజ్యభారమును నే వహింపఁజాలను. కాఁబట్టి నీవు నా పేరఁ బాలింపుము. రాజ్యము నాయది. నీవు నాప్రతినిధివని తెలుపుటకు నీపతాకము సన్న్యాసియుడుపుచాయ గలదిగా నుండని" మ్మని రామదాసుఁడు శివాజీకిఁ జెప్పి యతనిని దీవించి వెడలిపోయెను.

అప్పటినుండియు శివాజీమహారాజు కాషాయాంబరపతాక ముపయోగించెనని చెప్పుదురు. ఔరా! ఇదిగదా గురుభక్తి! ఇదిగదా స్వార్థత్యాగము! ఇదిగదా కర్మదీక్ష! ఇదిగదా కర్మఫలమందు విరక్తి! రాజ్యమును మరల శివాజి కిచ్చుటయం దనన్యసామాన్యలోకోపకారబుద్ధి వెల్లడించెనుగదా రామదాసుఁడు!

మహారాష్ట్రులు తమసామ్రాజ్యము రామదాసుని యనుగ్రహమువలనఁ గలిగినదని జ్ఞప్తియం దుంచుకొన్నంతవఱకు, వారల రాజ్యలక్ష్మి యత్యున్నతస్థితియందుండెను. ఈవిషయమును మఱచి, వారెప్పుడు ధర్మమార్గచ్యుతులైరో, స్వార్థపరాయణులైరో, యప్పటినుండి వారల సామ్రాజ్యము క్షీణించుట కారంభించెను; అప్పటినుండి వారలకును, ఇతరులకును వ్యత్యాస మగపడలేదు.

# ఆవృత్తి

శ్రీ వేదుల సత్యనారాయణ శాస్త్రి (సాహితీసమితి)

ఆ ప్రశాంత నిశాజఠరాంతమందు
కలత యెరుగని నిద్దురగాంచియున్న
గౌతమీనది నా మనోగత విషాద
తమము నంతయు తనలోన దాచుకొనియె.

ఆనటీసైకతముల నాయడుగుజాడ
చెరిపివేయగ వెనువెంట నరుగుదెంచు
గాలితరగల చల్లనికడుపులోన
కన్ను మూసెను నాయూర్పు గాడ్పులెల్ల.

చెడ్డయో మంచియో మహాసృష్టియందు
జరుగువిషయంబులను దటస్థముగ నాయ
నంతగగనమునందుండి యరయుచుండు
తారలె మదశ్రుకణముల నేరుకొనియె

నేన మిగిలితి నీగౌతమీనదీ ప
విత్రగర్భంబులో మ్రోతవెట్టుచున్న
యుగయుగాంతర విశ్వమహోగ్రదుఃఖ
జీవగీతాల కావృత్తి చెప్పుకొనగ.

భక్తికి మెచ్చి, కరుణాళుడై, యేశ్రమయు లేకుండ రెండవపెనము గర్భగుడిలోనుండునట్లు గావించెనట. ఉదయమున కుమ్మరి దైన్యముఖముతో వచ్చుసరికి తన యభీష్టము నెఱవేరియుండెను. ఈకథయంతయు చమత్కారము; విశ్వసించువారికి మహత్తువలె గన్పట్టును. కాని మాకట్లు గోచరింప లేదు. మేము గర్భాలయపుద్వారబంధము యొక్క ఎత్తువెడల్పులుకొలిచి, యానడుమ, ఈపెనము నిలువబెట్టి చక్రమువలె నడిపించిన దూరగలదా యని పరీక్షించిచూచితిమి. అపని సులభసాధ్యముగాదు, కాని ఒక్కమ్మడి యిరువదియైదుగురు మనుష్యులయినను ఎత్తినగాని కదలని యాపెనమును, లోపలికెట్లు తీసికొనివచ్చిరో యదియు నాశ్చర్యకరమగు విషయమే కదా! అందువలననే ప్రాకృతజనులు దానిని మాహాత్మ్యముగా విశ్వసింతురు.

ముఖమంటపముయొక్క వెలుపలిగోడమీద విగ్రహము లనేకములు చెక్కబడి యున్నవి. కాని అట్టివి గర్భాలయముయొక్క వెలుపలిగోడమీద లేవు. మేము వాటినన్నిటిని బరిశీలించి చూచితిమిగాని, అందు కొన్ని మాకు గ్రాహ్యములు కావయ్యెను. శిల్పశాస్త్రము లేవియు మాకడ నప్పుడు అందుబాటులో లేకపోవుట వలన, మేము జూచినవిగ్రహముల రూపకల్పనను బట్టి నామమును నిరూపింప లేకపోతిమి. తెలిసినవాటిని మాత్రము నిరూపించితిమి. ముఖమంటపములోనుండి, దక్షిణపు వైపునకు నొకప్రాకారములోనికి గుమ్మముండెనని తెలిపితిమి గదా! ఆగుమ్మమువద్దనున్న రూపములను ఏడెనిమిదింటిని ఇచట వివరించెదము. దీనినిబట్టి మిగిలిన వాటిని గూర్చి చదువరి యూహించుకొనవచ్చును. గుమ్మమునకు పడమటి వైపున, శివునిరూప మొకటి గానవచ్చుచున్నది. ఆరూపమునకు పండ్రెండు చేతు లున్నవి. ఊర్ధ్వరేతస్కుడై నృత్యముచేయుచున్న యామూర్తి నటరాజస్వామి యని మే మూహించితిమి. ఈమూర్తిచిత్రమును చదువరి వేఱొకచోట గాంచగలడు. గుమ్మమునకు తూర్పువైపున వరుసగా నేడు విగ్రహము లున్నవి. ఇవి, దక్షిణహిందూదేశపు శిల్పసంప్రదాయముతో సంబంధము లేనికతనను, మాకుత్తరహిందూస్థానపు శిల్పముతో పరిచయము లేనికతనను, వాటి మా నామరూపనిర్ణయము సరిగాకపోవచ్చును. తూర్పువైపుగా నున్న విగ్రహములలో మొదటిది మాకు 'నటరాజస్వామి'గా దోచెను. ఈవిగ్రహమునకు పండ్రెండు బాహువులు గలవు. తాండవరూపియై, ఊర్ధ్వరేతస్కుడైయున్న ఆ విగ్రహమునకు ఇరుప్రక్కల నిరువురు స్త్రీ లున్నారు. వారిరువురును, గంగా, పార్వతులయియుందురని మాయూహ. ప్రక్కనే నందియు నున్నది. తలకు పరివేషము గలదు. మీదిరెండు చేతులందును పడగలువిప్పినసాము లున్నవి. ఈ విగ్రహముతరువాత ఉగ్రనారసింహ విగ్రహమున్నది. కాని యుగ్రనరసింహావతారము నెత్తిన శ్రీమన్మహావిష్ణువును న్యూనతపఱచుటకై శరభమూర్తిగా శివుడవతరించినట్లు "కారణాగమము" దెలుపుచున్నది. అట్లయినచో నీమూర్తి శరభమూర్తియొక్కరూపమని నిర్ణయింపవచ్చును. దీని తరువాత విగ్రహమునకు నాల్గుచేతులు గలవు. ఈమూర్తి సింహముపై ఊర్ధ్వరేతస్కుడై నిలువబడి యున్నాడు. ఉభయపార్శ్వములందును, పార్వతీగంగాదేవులు గలరు. మీదికుడిచేతియందు త్రిశూలమును, యెడమదానియందు పరశువును క్రింది కుడిచేతియందు అక్షమాలయు, నెడమదానియందు కపాలమును గలవు. కుడిభుజముపై నాగ మొకటి పడగ నెత్తిపెట్టుకొని యున్నది. ఈ భయంకరాకారమును, మేము పశుపతిమూర్తిక్రింద గుర్తించితిమి. క్రీ. పూ. రెండవశతాబ్దము నందు భండార్కరుగారి మతమును బట్టి పాశుపతశైవోపాసన ఆరంభమయ్యెను. "శిల్పసార"ములో వర్ణింపబడిన పాశుపతమూర్తికి పదిచేతులు ఐదుతలలుగలవు; కాని కొన్ని ఆగమములు ఒకతలయు, నాల్గుచేతులను మాత్రము దెల్పుచున్నవి. పాశుపతమూర్తి భయంకరరూపియైయుండును. కాని యుపాసకులు సౌమ్యరూపమున రూపకల్పన జేసికొని యుపాసింతురు. ఆసౌమ్యరూపము మందస్మితవదనముగల చంద్రశేఖరుని బోలియుండును. ఇపుడీరూపము, చంద్రశేఖరుడైన గావలయును. లేకున్న సౌమ్యపాశుపతమూర్తియైన గావలయును. ఈపాశుపతమూర్తిప్రక్క భీమస్వరూపియైన నటరాజు గలడు. ఆతనికి నాల్గుచేతులు గలవు. త్రిభంగములతో, నూర్ధ్వరేతస్కుడై నర్తన సలుపుచున్నాడు. మీదికుడిచేతియందు అక్షమాల యున్నది. మీది యెడమచేయి, ఒకస్త్రీరూపముపై నుంచబడియున్నది. క్రిందిదక్షిణహస్తము, వరదముద్రను సూచించుకమలమును బట్టుకొని



౧. సరస్వతి



౨. నటరాజస్వామి (ఊర్ధ్వరేతస్కుడు)



3. కుమారస్వామి (సోమేశ్వరాలయముయొక్క- విమానముపై నొకగూటియందున్నది)



౪. బుద్ధవిగ్రహము-భూమిస్పర్శముద్ర

యున్నది. ఎడమచేతియందు కపాలమున్నది. ఈమూర్తికి కుడిప్రక్కను ఎడమకాలు మోకరించి యొక స్త్రీ ప్రార్థించుచున్నది. ఎడమప్రక్కనుగూడ నొక స్త్రీవిగ్రహము నిలువబడియున్నది. దీనికావల, వరాహమూర్తివిగ్రహమున్నది. దానికి నాల్గుచేతులు, ఎడమమోచేతిపైభాగమున భూదేవి స్త్రీరూపిణియై అధివసించియున్నది. మరియొకచోయి, భక్తివినమ్రుడై నిలువబడియున్న యొకపురుష [illegible] నుంచబడి యున్నది. దీనితరువాతిది డాకిని వరుణి యను పరిచారికలుగల దుర్గాశక్తివలె గానుపించుచున్నది. దాని కావల కుమారస్వామి విగ్రహముగలదు.

ఈరీతిగ, ముఖమంటపమునకు రెండువైపులను, సర్వశైవరూపము లయిన ఏకాదశరుద్రరూపములు అష్టమూర్తులు, లీలామూర్తులగు పంచదేహమూర్తి, దక్షిణామూర్తి, లింగోద్భవుడు, ఏకపాదమూర్తి, భిక్షాటనమూర్తి, ఉమామహేశ్వరుడు, చంద్రశేఖరమూర్తి, అర్ధనారీశ్వరుడు, అఘోరమూర్తి, రక్షోఘ్నమూర్తి, భైరవుడు, కాలభైరవుడు, పాశుపతమూర్తి మున్నగున వెన్నియో కలవు. వాటినన్నింటిని మేము, బరిశీలించుట కవకాశము లేకపోయినది.

ఆస్థానమంటపమునుండి దక్షిణద్వారమున వెలికి వచ్చినపుడు, పైని, యొక్క శిల్ప ప్రదర్శనము, మాదృష్టి నాకర్షించెను. అందు పార్వతీపరమేశ్వరులు జూదమాడుచు వినోదముగా కాలము బుచ్చుదురు. పాచిక లాటలో పాటవము తక్కువైన, శివుడు పందె మోడి పోవుచుండెను. తుదకు తనకున్న దానినంతయు నోడుట యేకాక, తిరిపమెత్తుకొను నాభూతభర్త, వాహనమయిన నందినిగూడ నొడ్డియోడెను. అంత పార్వతి చెలికత్తెలు జయముగాంచిన సంతోషముతో, నొడలెఱుగని యానందముతో నందిని తోలుకొని పోవుచుందురు. పతియు, దీనవదనుడై చిన్నబాటుతో దిలకించుచుండెను. ఈశిల్పము నెంతచూచినను, మాకు తనివితీర లేదు. వెలుతురు చాలనందున చిత్రపటము తీయజాలమైతిమి.

గుడికిచుట్టను ప్రాకారముగలదు. అందు అష్టదిక్పాలకుల దేవాలయములు గలవు. ఇంద్రుని దేవాలయపు గుమ్మముపై ఏడు గుఱ్ఱములమీద సూర్యభగవానుడు రథారూఢుడై వెడలుచున్నట్లును, అనూరుడు సప్తాశ్వములను పగ్గములతో బట్టుకొని రథమును దోలుచున్నట్లును, ఒకచిత్తరువు గలదు. ఈప్రదర్శనము చాలపురాతనము, అపూర్వమును విశేషించి మనోహరమునై యున్నది. ఈ గుడికి, ఉత్తరదిక్కున నెలిగోడమీద ప్రాచీనకాలపు యోధుని చిత్ర మొకటి గలదు. ఎడమచేతియందాతని ఎత్తువిల్లును, కుడిచేతితో నమ్ములను, బట్టుకొని యున్నాడు. మొలలో కత్తిగలదు. శిరముపై కురులన్నియు, నున్నగాదువ్వబడి యొకశిఖగా, వీరపురుష లాంఛనముగ జుట్టబడియున్నవి. ఈవీరునివేషము ఉడుపులును నిస్సంశయముగా ప్రాచీనములు. ఈ వీరుని చిత్రించుటవలన శిల్పియుద్దేశ మేమయియుండునా యని మాకు సంశయము తోచుచున్నది. ఇయ్యది కేవలము ప్రాచీన కాళింగవీరుని చిత్రించుటకంటె విశేషభావము శిల్పి కుండవలెనని మాయూహ. మాయూహానుసారియైన యో నీవీరపురుషవిగ్రహము, కిరాతరూపమున నుండు ఈశ్వరుడు గావలయును. ఈ విషయ మింకను బరిశోధింపవలయును.

అష్టదిక్పాలకుల గుళ్లు, వరుసగా నెనిమిది దిక్కులందు లేక, అక్కడక్కడ చెదరియున్నవి. మధ్య నొకచోట దక్షిణపువైపున వినాయకుని గుడియు, పడమటను గర్భగుడికి వెనుకతట్టున కుమారస్వామి గుడియు గలవు. అష్టదిక్పాలకాలయములలో, కుబేరుని దేవాలయముపై కొన్ని ప్రాచీనశాసనములు, వేంగీ, పల్లవ, తెలుగు, కన్నడ లిపియందు గానవచ్చుచున్నవి. అవి ఛందోబద్ధములయి యుండినట్లు సంశయము దోచెడిని. వాటిలో "నృపతుంగ నరసింహాఢ్యు" అనువాడొకడు పేర్కొనబడి యున్నాడు. అప్పుడు మావద్ద పరికరములేవియు లేని కతన శాసనమునకు ప్రతులెత్తించి సావకాశముగా చదువుటకు వీలు లేకపోయెను. ఎండకు ఎండి, వానకు దడిసి అక్షరములు అరిగిపోయి, స్పష్టముగా గానరానందున శాసనమును స్పష్టముగా జదువలేమైతిమి. ఈకుబేరాలయ మున్నగుడి యెదురుగా నుత్తర దిక్కున స్వామికల్యాణమంటపము గలదు. దానిపై నిప్పటికిని ఉత్సవవేళలందు, పర్వవేళలందు స్వామికి సేవలు జరుపుచుందురు.

గుడి దక్షిణపువైపు ప్రాకారములోనుండి, యొక గుమ్మము గలదు. అందుండి, చెంతనేయున్న ఆంజనే

యాలయమును, దానికావల కొంచముదూరములో నున్న మఠమునుజూడబోయితిమి. ఆంజనేయాలయమును, మఠమును నవీనముగా గట్టబడినవే యయినను, వాటిని కట్టుటకు, ప్రాచీనకట్టడములలోని శిథిలభాగము లుపయోగింపబడినట్లుగానవచ్చును. ఆంజనేయాలయమునందు ఒకతాతిపై యుద్ధరంగమునందు ఏనుగును డీకొనుట చిత్రింపబడియున్నది. బాణములు పరంపరగ వచ్చి గ్రుచ్చుకొనుచున్నను ఆమత్తేభము ఒకనిని తనకాలిక్రింద పెట్టియణచివేయుచు, తొండముతో యుద్ధము సేయుచున్నది. దానిపై మావటీడొక డాసీనుడై యున్నాడు. ఇదిగాక గర్భాలయపు వెలుపలిగోడమీద నుత్తరదిక్కు మొగమైయున్న చిత్తరువొకటి మాదృష్టి నాకర్షించెను. అందు మనుష్యుని మొగముగల మకరముపై కొందరు యోగులు, ప్రయాణము సేయుచున్నట్లును, చుట్టునంతయు జలమున్నట్లును చిత్రింపబడియున్నది. ఇందలి యైతిహ్య మేదియో స్మరింపజాలకపోతిమి గాని దీనికి బౌద్ధులజాతకకథలతో సంబంధముకలదనిమాత్రము మాకు జొడగట్టెను. చిత్రమును చాలపురాణమైనది. కావున ఈవిషయ మింకను విమర్శింపదగియున్నది.

ఇక నాసమీపముననున్న మఠములో మాదృష్టి నాకర్షించిన విశేషములు పెక్కులు లేవుగాని యున్నవి మాత్రము చాలప్రాచీనశిల్పము లయియున్నవి. మఠమునందొకచోట నొక మంటపముయొక్క సోపానముల పార్శ్వమునగల పిట్టగోడపై నొకశిల్పప్రదర్శన మున్నది. అందు లంబినీవనమును, మాయాదేవిప్రసవమును, బుద్ధుని జననమును గలవు. సిద్ధార్థుని యవతారమునకై వేచియున్న దేవతలు సాష్టాంగనమస్కారము నాచరించుచున్నారు. దేవతలను నిరూపించుటకు శిల్పివారిని ఆకాశమునందు అడ్డముగా పరుండబెట్టినాడు. ఈశైలి కడుంగడు పురాణమైనది. బుద్ధుని జన్మప్రకారమును పరిచారకులవలన శుద్ధోదనుడు గాబోలు దూరముననుండి వినుచున్నాడు. అతనిచెంత నొకస్త్రీవిగ్రహము ఆసీనురాలై, పెక్కుమంది పరిచారకులచేతను, ప్రతీహారులచేతను పరివృతయై దానములు చేయుచున్నది. మాయాదేవి, శిశువునకు, ప్రక్కలో పరుండబెట్టుకొని పాలిచ్చుచున్నట్టులొకచిత్తరువును, ప్రసవవేదనపడుచున్నట్లొక ప్రదర్శనమును, బిడ్డనెత్తుకొని చూపించుచున్నట్లును, దేవతలు పుష్పవర్షము గురిపించుచున్నట్లుమరియొక ప్రయోగమును గూడనందే కలవు. ఈప్రదర్శనమంతయు నేకకథకు సంబంధించియుండునా యని చాలసేపు చింతించి తుదకిది బుద్ధ జన్మకథగా నిర్ణయించితిమి. మఠమువెనుక నొక చిన్న పువ్వులతోటగలదు. అందు గోడలో నతికించబడి యొక తాతిఫలకపై పల్లవాక్షర వీణియ వాయించుచున్నట్లున్నది. ఇదియు మిక్కిలి మనోహరమైనరూపము. మరియు ప్రాచీనము.

ఇంతటితో ముఖలింగేశ్వరాలయమును జూచుట ముగించి, ప్రక్కనున్న భీమేశ్వరాలయమును సందర్శింపబోయితిమి. భీమేశ్వరాలయము, ముఖలింగేశ్వరాలయమునకు నూఱుగజములదూరమున నున్నది. అంతయు శిథిలావస్థయం దున్నది. గోపురమును, మంటపమును దప్ప మిగిలినదంతయు కూలిపోయినది. దేవాలయమునందొకత్రాచుపాము నివాసముగా నున్నదని భయపెట్టియూరివా రెవ్వరును, మాతోడ రారైరి. కాని, మేము నిర్భయముగా నందు ప్రవేశించితిమి. భీమేశ్వరాలయమునకును, మధుకేశ్వరాలయమునకును ఏమియు భేదము లేదు. ఈగుడియు, ముఖలింగేశ్వరాలయమువలె పూర్వదిశాభిముఖమై యున్నది. ముఖమంటపములోని గోడలమీదను, కంబములమీదను, ద్వారములమీదను, రెండవ ప్రజాహస్తునినాటివి, అనంతవర్మచోడగాంగదేవునినాటవి శాసనములు పెక్కులు గలవు. అవిఅన్నియు నాంధ్రభాషయందే కలవు. సింహద్వారముమీదనున్న శాసనములలో నొకదానియందు:

"ప్రోలినాయకు ఎఱమనాయకుంగాలి
కొడుకు శ్రీకరణగంగవిద్యాధర
దేవరాశ్వరుండైన సొమ్ముంలరేవల
సంధివిగ్రహారేచన పెట్టిన అఖండవత్తిక
దీప ౧. నే మాడా ౫"

అనియున్నది. ఇందలి సంధివిగ్రహారేచన కవిజనాశ్రయి కృతిపతి యేమో యని మాకు సంశయముతోచెను. దాని క్రిందనే "తిరువాండి" యను ఒకని శాసనము, రాజరాజ దేవరకుమారాంతువుద్ధి యొక శాసనమును పెక్కులు గలవు. మంటపమునందు కుడివైపున రెండు విగ్రహా

